# గంటల పంచాంగం

శ్రీ హేమలంబ నామ సం॥ ఆషాఢ శు॥ ద్వితీయ 1957 సం॥ జూన్ 29 శనివారం శు॥ ద్వితీయ 20-85 పుష్య 12-7 వర్జ్యం 19-41 ల 21-8 ని.

శు॥ తృతీయ జూన్ 30 ఆదివారం శు॥ తృతీయ 17-26 పుష్య 10-10 వర్జ్యం 21-45 ల 23-12 ని.



ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

హేమలంబ నామ సం॥ ఆషాఢ. శు॥ ద్వితీయ
శనివారం

## నిరాయుధీకరణపై సమాలోచనలు

నిరాయుధీకరణ గురించి ప్రస్తుతం లండన్‌లో జరుగుతూ వున్న సంప్రతింపులు ఫల ప్రదమవుతున్న సూచనలు కన్పిస్తున్నవి. సమితి ఉపసంఘ సమావేశాల్లో పాల్గొంటున్న అమెరికా, రష్యా, ప్రతినిధులు ప్రధానాంశాలపై సమాధానాన్ని సాధించడానికి శాయశక్తులా కృషిచేస్తున్నారు. అమెరికా, రష్యా ప్రభుత్వాల వైఖరిలో కూడా చాలా మార్పువచ్చినది. వీటన్నింటి ఫలితంగా అణ్వస్త్ర పరీక్షలను తాత్కాలికంగా ఆపివేయడానికి పశ్చిమ రాజ్యాలు కూడా అంగీకరించినవి. సోవియట్ రష్యా ఈ సూచనను మొదటనే అంగీకరించినది. అంగీకరించడమేగాదు, ఇతర రాజ్యాలు అంగీకరించే పక్షంలో, అణ్వస్త్ర పరీక్షలను ప్రస్తుతమేగాక, శాశ్వతంగా కూడా ఆపడానికి రష్యా మొదట్నుంచీ సిద్ధముగానే వున్నది. అణ్వస్త్ర పరీక్షలనేగాక, అణ్వస్త్రాలను పూర్తిగా నిషేధించడానికి కూడా రష్యా సుముఖంగానే వున్నది. అణ్వస్త్ర పరీక్షలను తాత్కాలికంగా ఆపివేయడానికి లండన్ సమాలోచనలలో అంగీకారం కుదిరినది గనుక, అణ్వస్త్ర పరీక్షలను పూర్తిగా, శాశ్వతంగా విరమించే విషయమైకూడా అంగీకారం కుదరగలదని ఆశింపవచ్చు.

ఇక సైనికదళాల తగ్గింపు, ఆయుధసామగ్రి తగ్గింపు మొదలయిన విషయాలపై అమెరికా ప్రతినిధి శ్రీ హెరాల్డ్ స్టాసెన్ చేసిన ప్రతిపాదనలను సిద్ధాంతరీత్యా సోవియట్ రష్యా ప్రతినిధి అంగీకరించారు. ఆయుధాల ప్రమాణాన్ని తగ్గించక, ఆయుధాల ఉత్పత్తిని విరమించక సైనిక దళాల సంఖ్యను తగ్గించినందువల్ల ప్రయోజనంలేదు. సైనిక దళాల తగ్గింపు ప్రయోజనకరంగా ఉండాలంటే, యుద్ధ సామగ్రిని నిర్ణీత హద్దులమేరకు తగ్గించడం అవసరం. సైనిక దళాలసంఖ్యను తాత్కాలికంగా తగ్గించినా, యుద్ధసామగ్రి తగినంతగా ఉన్నప్పుడు కొద్ది వ్యవధిలోనే తిరిగి సైనిక దళాల సంఖ్యను వృద్ధి చేసుకొనడానికి అన్ని రాజ్యాలకూ అవకాశం ఉంటుంది.

అమెరికా ప్రతినిధి చేసిన ప్రతిపాదనలకు ఆధారమైన సిద్ధాంతం నిరాక్షేపణీయమైనది. కనుకనే యీ ప్రతిపాదనలలో ఇమిడివున్న సూత్రాన్ని రష్యా ప్రతినిధి అంగీకరింపకలిగారు. అమెరికా మిత్రరాజ్యాలైన బ్రిటన్, ఫ్రాన్సు, కెనడాలు ఏవో కొన్ని షరతులకు లోబడి శ్రీ స్టాసెన్ ప్రతిపాదనలను అంగీకరించినట్లు తెలుస్తున్నది. లండన్ సమాలోచనల ధోరణి ఇలావుండగా అమెరికా అధ్యక్షుడు "ఆయుధ విసర్జనకు తీసుకునే ప్రథమ చర్యలలో అణ్వస్త్ర పరీక్షల నిషేధం భాగంగా ఉండాలి" అని సూచించారు. అణ్వస్త్ర పరీక్షలను మరో అయిదారు సంవత్సరాల్లో నిరపాయకరంగా ఉండేటట్లు చేయవచ్చునని వివరిస్తూ ప్రజల్లో ఈ పరీక్షల విషయమై అమితమైన భయం వున్నదని, ఈ పరీక్షలను ఆపవలసిందిగా ప్రజలు కోరుతున్నారని, కాబట్టి ఈ విషయమై ఒక నిర్ణయం జరగాలని శ్రీ ఐసెన్‌హోవరు స్పష్టంచేశారు. భవిష్యత్తులో జరిగే యుద్ధంలో విజయం పొందే పక్షం అంటూ వుండదనికూడా అమెరికా అధ్యక్షుడు స్పష్టంగా ప్రకటించారు.

శ్రీ స్టాసెన్ చేసిన ప్రతిపాదనలలో అణ్వస్త్ర పరీక్షల ప్రసక్తి లేదని రష్యా ప్రతినిధి అసంతృప్తి చెందవలసిన అవసరంలేదు. అమెరికా అధ్యక్షుడే ఆ విషయమై అమెరికా వైఖరిని స్పష్టం చేశారు. అమెరికా ప్రతిపాదనలలో వున్న సందిగ్ధాలను తొలగించి, స్పష్టం చేయాలని రష్యా ప్రతినిధి కోరారు. అమెరికా, రష్యా ప్రతినిధులు ఉభయులూ చేరి ఈసందిగ్ధాలను తొలగించడానికి ప్రయత్నింపవచ్చును. స్వల్ప, చిల్లర విషయాలనుగురించి విభేదాలను పెంచుకొనక సమాధానం కుదరడానికి వీలున్న అంశాలను శ్రద్ధగా పరిశీలించి సమాధానం సాధించడానికి కృషి చేయడం అవసరం. ఫలోన్ముఖమైన లండన్ సంప్రతింపులు ఫలించేటట్లు చూడడం అత్యంతావశ్యకం.

## 'అణుశక్తి శాంతి ప్రయోజనాలకే'

### అంతర్జాతీయ కార్మిక సంస్థ తీర్మానం

జెనీవా, జూన్ 27: నిరాయుధీకరణతోబాటు, అణుశక్తి శాంతి ప్రయోజనాలకే వినియోగం కావాలంటూ, మూడు వారాలుగా యిక్కడ సమావేశం అవుతున్న అంతర్జాతీయ కార్మిక సంస్థ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఈ సమావేశాలు యివాళ్టితో ఆఖరైనాయి. తీర్మానాన్ని 168 మంది బలపరిచారు. ఒక్కరు గూడా ప్రతిఘటించలేదు. అయితే 89 మంది మాత్రం ఓటింగులో పాల్గొనలేదు.

### పని గంటల తగ్గింపు

పనిచేసే గంటలను తగ్గించే విషయమై 1958 సమావేశం చర్చించాలనికోరుతూ, భారతదేశంతోబాటు, 19 దేశాలు సమష్టిగా ప్రతిపాదించిన మరొక తీర్మానాన్ని గూడా ఈ సమావేశం ఆమోదించింది.

### స్త్రీ కార్మికుల సమస్యలు

స్త్రీ కార్మికులకు సంబంధించిన ప్రత్యేక సమస్యలను వ్యవహరించేందుకు, ఒక త్రైపక్ష సంఘాన్ని ఏర్పాటుచేసి, త్వరలో సమావేశపరచాలని, సంస్థపాలకవర్గాన్ని కోరుతూ యీ సమావేశం తీర్మానించింది.

## దేశంలో పంచదార ఉత్పత్తి

### 1957 జూన్ వరకు లెక్కలు

న్యూఢిల్లీ, జూన్ 27: 1957 జూన్ వరకు ఈ సంవత్సరంలో 20 లక్షల 2 వేల టన్నుల పంచదార ఉత్పత్తి అయింది. అందులో 13 లక్షల 28 వేల టన్నులు బట్వాడా అయింది. ఈ బట్వాడా లెక్కలను జూన్ 15న జరిగిన లెక్కలనుబట్టి తేల్చారు.

1956 లో ఇదేకాలంలో 18 లక్షల 25 వేల టన్నుల పంచదార ఉత్పత్తి అయి, 18 లక్షల 18 వేల టన్నులు బట్వాడా అయింది.

జూన్ 15 నాడు మిల్లులవారిదగ్గర 12 లక్షల 1 వెయ్యి టన్నుల పంచదార నిల్వవుంది. నిరుడు ఇదేనాటికి 12 లక్షల 16 వేల టన్నులు నిల్వవుంది.

## సాహిత్య పరిషత్తును ప్రభుత్వమే నెలకొల్పాలి

### విశ్వనాథ సత్యనారాయణ అభిప్రాయం

విజయవాడ, జూన్ 27: "అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు అవసరం. ప్రభుత్వమే దానిని ఏర్పాటుచెయ్యాలి" అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ప్రకటిస్తున్నారు.

అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు వ్యవహారంపై తమ అభిప్రాయాలను శ్రీ సత్యనారాయణ ఇట్లా తెలియ చేస్తున్నారు: "హైదరాబాదులో సాహిత్య పరిషత్తు జరగటం - దానిమీద విద్యామంత్రి ప్రకటన చేయటం - కొందరు మంత్రిగారి ప్రకటనమీద సమాధానాలు మొదలైనవి జరపటం - పత్రికా పఠితు లందరకు తెలును. ఈ విషయంలో మీ అభిప్రాయము ఏమి అని ఒక పత్రికా ప్రతినిధి నన్నడుగగా - 'ప్రత్యేకంగా నేను చెప్పవలసినదేమీ లేదు' అన్నాను. 'కాదు మీ అభిప్రాయము కూడ చెబితే మంచిది. కొందరి అభిప్రాయాలు తెలుసుకొనగా భవిష్యత్తులో అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు నిర్మింపబోయేవారికి ఒక అభిప్రాయము కలుగుతుంది' అన్నారు. సరేనన్నాను.

'నా అభిప్రాయములో సాహిత్య పరిషత్తు ప్రభుత్వావారే ఏర్పాటుచేస్తే బాగుంటుంది. అప్పుడు తక్కిన విషయాలు ఎట్లా ఉన్నా, ధనవిషయం కొరతలేకుండా ఉంటుంది. అన్నిటికన్నా అది ప్రధానము కదా?' అన్నాను. ప్రతినిధి అన్నాడుకదా - 'ప్రభుత్వమువారు వారి యిష్టమువచ్చిన వారిని ఎన్నుకొంటారు. నిజమైన సాహిత్యవేత్తలు బయటనే ఉండిపోతారు.'

'తెలివితక్కువంటే ఉన్నలోభి మంచివాడు' అన్నాను పైగా ఎక్కడో ఢిల్లీలో ఉన్న, సభలో కొన్ని అన్యాయాలు జరిగితే జరగవచ్చునుగాని - మరి ప్రత్యేకంగా తెలుగుదేశమున నడిబొడ్డులో సంస్థ పెడితే - అంత అన్యాయము జరగదనుకుంటాను. జరిగితే ఎవరో ఒకరు పత్రికలలో వ్రాస్తారు. తెలుగువాళ్ళందరికి తెలుస్తుంది. ఢిల్లీలో జరిగితే అల్లా కాదుగదా తెలుగు పత్రికలలో వ్రాస్తే తెలుగు పత్రికలలోనే ఉంటుంది. హిందీవాళ్ళకి ఇంగ్లీషువాళ్ళకి తెలియదు. ఇక్కడ ఆ యిబ్బంది లేదుగదా అన్నాను.

ప్రతినిధి 'మీరు హైదరాబాదు వెళ్ళలేదేమి' అన్నాడు. నేను రాలేనని ఈ తీరము వ్రాశాను అన్నాను. ప్రతినిధి 'దాను మీరు అంగీకరించారని సభలో చెప్పారు' అన్నాడు. నేను నవ్వాను. నవ్వుతావేమి అన్నాడు. నేను వ్రాసిన ఈ తీరం సభలో చదవలేదని విన్నాను. అందుకని నవ్వుతున్నాను. అయితే ఏమి వ్రాశారేమిటి అన్నాడు. చెప్పాను, ఇదీ నా ఈ తీరమని.

"అయ్యా! నేను వద్దామనుకున్నాను గాని పరిస్థితులు బాగాలేక రావటం లేదు. నేను వచ్చినా రాకపోయినా ఒకటే. నేను వచ్చినా చెప్పేవి రెండు మూడు మాటలు. ఒకటి: అరువదియేండ్లు దాటినవారు ఈ సభలో ఉండరాదు. రెండు: స్వరాజ్యం వచ్చిన తరువాత రెండు గ్రంథాలు వ్రాశారో వాళ్లే ప్రధానసభ్యులుగా ఉండాలి. సాహిత్య విమర్శ అంతా వారే చేయాలి. మంచి సాహిత్యం రోజులా వస్తుందో వాళ్ళు విచారించి తీర్మానించుకోవాలి. దేశంలో మంచి సాహిత్యంపుట్టాలి. మూడు: అధికారాలకోసం పలుకుబళ్ళ కోసం దేవులాడేవాళ్లకు ఈ పరిషత్తులో స్థానం ఉండకూడదు. వట్టి సాహిత్యపరులు — సాహిత్యాభివృద్ధి బుద్ధితో పనిచేస్తే అభ్యుదయకరం గాని — అబద్ధాలు సబద్ధాలు కలిపి పరదేశాలకు బులెటిన్ పంపించినందువలన సాహిత్యాభివృద్ధి జరగదు.

నాలుగు: అరువది యేండ్లు దాటినవాళ్లను, సాహిత్య విమర్శకులను - అభిమానులను వేరొక సభగా నిర్మించి, వారి సాహిత్య విమర్శ సభలకు రచయితలు వెళ్ళి తెలుసుకొనవచ్చును.

ఐదు భాషాభావములు రెండు సుస్థితిలో నుండునట్లు పరిషత్తు చూడవలయును.

నా ఈ తీరములోని ప్రధానమైన అంశాలు యివి నేను యిప్పుడు మీకు కొంచెము పెంచి చెప్పాలనిపిస్తున్నది. తాత్పర్యముమాత్రము ఇదియేఅన్నాను. ప్రతినిధి 'అసలు మీ అభిప్రాయము చెప్పనేలేదు' అన్నాడు. నేను 'అభిప్రాయ మేమున్నదయ్యా — పూర్వము మనదేశములో ఏదైనపనిచేస్తే దోషములను పరిహరించటం ఎట్లాగా అని ఉండేది. ఇప్పుడు ఋణాలను పరిహరించటం ఎలాగా అన్నట్లుగా వున్నది. నన్నయగారి కవిత్వములో గుణాలు చూస్తే తప్పు. ఏదో గాలి గావల్సిన్న మార్గానపడిపోతే సరైంటు. ఎవ రేమిచెప్పగలరు? నియంతలనుకాస్తే రోజును? నేను ఒకకవి గొప్పవాడు — అని వ్రాస్తే కాదని వెంటనే వ్రాసేవాడున్నాడు. మంచిదానిని మంచిది. చెడ్డదానిని చెడ్డది — మంచిది చెడ్డది — చెడ్డది మంచిది — ఇందులో ఏది వ్రాసినా — కాదని వ్రాసేవా రున్నారు. కనుక ఏమీ చేయనక్కరలేదు. కాని, కాలానుగుణంగా అఖిలాంధ్రసాహిత్య పరిషత్తు ఉండవలసిందే. అది బాగా లేదు అంటావా తక్కినవన్నీ బాగా ఉన్నయి గనుకనా? అన్నింటిలోనూ మంచి — చెడ్డా కలసి వుంటవి. పరమేశ్వరుని అనుగ్రహము ఉన్నకాలములో మంచి పైకి వస్తుంది. లేని కాలంలో చెడ్డ పైకి వస్తుంది."

ప్రతినిధి "ఇదంతా వేదాంతంగా ఉంది" అన్నాడు... "అవును బాబా ప్రస్తుతం స్థితి ఎలా వున్నదంటావు? చివరికోటాలు రాసుకున్నా అనుకుంటూ కూర్చుందామని ఉన్నది. కాని కూర్చోనివ్వటట్లు లేదు. మరి నువ్వు అడిగితే నే చెప్పను అంటే బాగుంటుందా? అందుచేత చెప్తున్నాను. అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు ఉండాలి. ప్రభుత్వమే దానిని పెట్టాలి. ప్రభుత్వమువారిని నేను కోరేదేమిటంటే - అయ్యా! పరిషత్తును జాతీయంగా చేయండి. మెరమెచ్చులకు ఆక్షేపణలకు లొంగకండి. భాషయొక్క ఔన్నత్యము చెడకుండా నిజంగా ఉత్తమ సాహిత్యం పుట్టేలాగా ప్రయత్నం చేయండి"అని.

ఉత్తమ సాహిత్యమంటే ఏది అన్న ప్రశ్నలోకి దిగారూ. అసలు తెలదు కాని, జాతీయమన్న భావము అంతా అవి స్పష్టముగాలేదు కనుక జాతీయతను రక్షించండి - అని ప్రార్థిస్తున్నాను.

## నిర్మాణాత్మకంగాలేవు

### శ్రీ సబ్బాజీరావు ప్రకటన

హైదరాబాదు, జూన్ 27: శ్రీ సబ్బాజీరావు ఇట్లా వ్రాస్తున్నారు: "అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు ఏర్పాటయిందనీ, ఆంధ్రసారస్వత రంగానికి ప్రాతినిధ్యం వహించగల ఏకైకసంస్థ రూపొందినదని సాహిత్యంతో సంబంధంగలవారందరూ ఆనందించదంలో ఆశ్చర్యమేమీలేదు. అయితే ఈసాహిత్యపరిషత్తునుగురించి విద్యామంత్రి శ్రీ పట్టాభిరామారావు ఇటీవల చేసిన ప్రకటన, ఆతరువాత వెలువడిన కొన్ని అభిప్రాయాలూ సంస్థను దెబ్బతీసేవిగా ఉన్నవేగాని నిర్మాణాత్మకంగాలేవు. పరిషత్తు కార్యక్రమాన్ని పరిశీలించి, పరిషత్తు తీసుకుపడిగే కోరికలను తెలుసుకుని, పరిషత్తుకు తీడివచ్చేదాకా ఓపిక పట్టి ఆతరువాత విద్యామంత్రి ప్రకటన చేసివుంటే బాగుండేది. తన అభిప్రాయాన్ని పరిషత్తుకు తెలియచేసి ఆతరువాతనే దానిని పత్రికలకు విడుదల చేయడం సరయినపద్ధతి."

"విద్యామంత్రి ఇటీవలచేసిన ప్రకటన రాజకీయాలలో ఆయనకుగల అనుభవానికి తగినట్టులేదు. సారస్వతాభిమానులలో ఒకరయిన శ్రీ పట్టాభిరామారావు పరిషత్తు ముసాయిదా నిబంధనలకు అవసరమైన మార్పులను మొదట్లోనే సూచించివుంటే ఎంతైనా ఉపయోగకరంగా ఉండేదికదా?"

"మంత్రి ప్రకటన ఫలితంగా మరి కొందరి అభిప్రాయాలలో చలనం కలిగింది. పరిషత్తు ముసాయిదా నిబంధనలను అందుకున్నవారూ, తాత్కాలిక సంఘంలో సభ్యులుగా ఉన్నవారూ, నియమావళిని ఆమోదించిన సమావేశంరోజున హైదరాబాదులో ఉండికూడా సమావేశానికి హాజరు కానివారూ కూడా ఇట్లా సంచలనం కలిగిన వారిలో ఉన్నారని రూఢిగా తెలిసింది. దినపత్రికలన్నింటిలోనూ ప్రకటితమైన పరిషత్తు ముసాయిదా నిబంధనలపై గడువులోగా వీరు తమ అభిప్రాయాలను ఎందుకని పంపించలేదూ? మంత్రి దృక్పథాన్ని బలపరచడమే వీరి ఉద్దేశమనే అపోహకు వీరు అవకాశం ఇవ్వడంలేదా? వచ్చిన అభిప్రాయాలను ఎంతవరకూ పరిశీలనలోకి తీసుకున్నారనేది వేరే ప్రశ్న."

"ఆంధ్రసారస్వతానికి సంబంధించినంత వరకూ రాష్ట్రమంతటికీ ప్రాతినిధ్యం వహించే సంస్థ అవసరమనేది నిర్వివాదాంశం. ఆసంస్థను ఏవిధంగా రూపొందించాలనేది ప్రధానాంశం. ప్రస్తుత పరిస్థితులలో నిబంధనావళిలో కొన్ని మార్పులను పరిషత్తు కార్యవర్గం తీసుకురావడం సమంజసమని తోస్తోంది. రచయితలకు వ్యక్తిగత హోదాలలో సభ్యత్వమిచ్చి, వారికి ప్రాతినిధ్యమిచ్చి కృషి చేస్తున్న సంస్థలు ఇప్పటికే చాలా ఉన్నవి. అందువల్ల ఇతర సంస్థల కార్యక్రమానికి అతీతమైన ప్రయోజనాన్ని అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తునుంచి సారస్వతాభిమానులు ఆశిస్తారు."

"అటువంటి పరిస్థితులలోనే ఈ పరిషత్తుకు ప్రత్యేకస్థాయి, ప్రభుత్వ గుర్తింపూ లభ్యమౌతవి. అందుచేత అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు తన నిబంధనావళిలో కొన్ని మార్పులు చేసుకుని రాష్ట్రస్థాయిని అలవరచుకోవాలి. అందుకు అనుగుణంగా కొంతమంది ప్రత్యేక వ్యక్తుల మినహా వ్యక్తిగత సభ్యత్వ పద్ధతిని పరిషత్తు వదలివేయ్యాలి; కవి సన్మానాలనూ, గ్రంథ ప్రచురణలనూ పరిమితం చెయ్యాలి. ఈ కార్యక్రమాలను సారస్వత సంఘాలకు వదలిచేసి, వాటిని ప్రోత్సహించాలి. వాటి సభ్యత్వంలో పరిషత్తు ఒక సమాఖ్యగా వ్యవహరిస్తూ, ఇతరసంస్థల ప్రతినిధులు మాత్రమే పరిషత్తు కార్యవర్గంలో సభ్యులయ్యే ఏర్పాటు చెయ్యాలి. ఈ విధంగా ఇతరసంస్థల అభివృద్ధితో అఖిలాంధ్ర సాహిత్యం పరిషత్తు అభివృద్ధికి అవినాభావ సంబంధం ఉంటేనే, ఆ సంస్థలకూ, వాటిద్వారా ఆర్థికస్తోమత ఉంటుంది. చక్కటి భవిష్యత్తు ఉంటుంది; ఫలితంగా సారస్వతం పురోభివృద్ధికి పునాదులు ఏర్పడుతవి."

"నిబంధనావళిలో అనువైన మార్పులు తీసుకురావడంద్వారా కార్యవర్గం విజ్ఞతను చూపించాలి. సమాఖ్యగా రూపొందితేనే అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తుకు రాష్ట్రస్థాయి లభిస్తుంది. ఇక అప్పుడు ప్రభుత్వ గుర్తింపును సంపాదించడం ఏమంత పెద్ద సమస్యకాదు. కలకాలం కలగా నిలిచి నేటికి రూపొందిన అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు భవిష్యత్తును తీర్చిదిద్దడంలో సారస్వతాభిమానులందరూ సహకరించి, నిర్మాణాత్మకమైన సూచనలు చెయ్యాలని విజ్ఞప్తి చేస్తున్నాను."

## పశ్చిమాసియా సమస్యలు

### కామన్వెల్త్ ప్రధానుల చర్చలు

లండన్, జూన్ 27: కామన్వెల్త్ ప్రధానమంత్రుల సమావేశం యివాళ పశ్చిమాసియాసమస్యలను చర్చించింది.

ఇవాళ చర్చలో సూయజ్ పోరాటం మొదలైన పూర్వ విషయాలు రాలేదు. పశ్చిమాసియా ప్రాంతపు ప్రస్తుత సమస్యలు, భవిష్యత్తు ఇవిమాత్రమే ముఖ్యంగా చర్చలోకి వచ్చాయి.

అరబ్ ప్రపంచంలో పరిస్థితులు ఎలాగైనా క్రిందమీదు కాబోతున్నాయని కొందరు అభిప్రాయపడ్డారు.

సూయజ్ కాలువ రవాణా నిర్వహణపై ఈజిప్టు ప్రకటన చర్చకు వచ్చింది.

రవాణా గురించి ముందు కుదరవలసిన ఒప్పందం, భద్రతా మండలి నిర్వచించిన ఆరు సూత్రాలకు లోబడి ఉండాలని చాలమంది అన్నారు.

ఈజిప్టు సిరియాల రాజకీయ విధానాలు, జోర్డాన్‌లో ఇటీవలి క్లిష్టపరిస్థితి కూడా చర్చకు వచ్చాయి.

పశ్చిమాసియా ప్రాంతంపట్ల అమెరికా ఈ మధ్య కొత్తగా మంచి ఆసక్తి చూపుతున్నందుకు కొందరు తృప్తి ప్రకటించారు. ఈ ప్రాంతంలో సుస్థిరతకు అభివృద్ధికి అమెరికా ఆసక్తి తోడ్పడుతుందని వీరన్నారు.

ఇవాళ మధ్యాహ్నంకూడా అరబ్-ఇజ్రేలీ వివాదాలపై చర్చ జరిగింది.

పశ్చిమాసియాపై చర్చ పాకిస్తాన్ ప్రధాని శ్రీ సురావర్ది ప్రసంగంతో ప్రారంభమయింది. పశ్చిమాసియా పరిస్థితిపై శ్రీ సురావర్ది తమ అభిప్రాయాన్ని వివరించారు. ఈ ప్రాంతంలో సుస్థిర పరిస్థితులు నెలకొల్పడానికి బాగ్దాద్ ఒడంబడిక ఎంతో సహాయపడిందని వీరన్నారు.

భారతప్రధాని శ్రీ నెహ్రూ పశ్చిమాసియా ఆర్థిక సామాజిక సమస్యలను గురించే మాట్లాడారు.

అరబ్-ఇజ్రేలీ వివాదం గురించి బ్రిటిష్ ప్రభుత్వ అభిప్రాయాలను విదేశాంగమంత్రి శ్రీ సెల్విన్‌లాయిడ్ వివరించారు. ఈ వివాదం త్వరలో తేలేది కాదని వారి అభిప్రాయం.

పశ్చిమాసియాలో ఇటీవలి పరిణామాలనుగురించి ఆస్ట్రేలియా ప్రధాని శ్రీ మెంజీస్ అనేక ప్రశ్నలు అడిగారు.

ఇవాళఉదయం పశ్చిమాసియాపై చర్చ ప్రారంభించేముందు, నిన్న రష్యాతో సంబంధాల విషయంపై ప్రసంగించగా మిగిలినవారు మొదట మాట్లాడారు. దక్షిణాఫ్రికా తరఫున సమావేశంలో పాల్గొంటున్న విదేశాంగ మంత్రి శ్రీ ఎరిక్‌లువో, ఆఫ్రికాపట్ల రష్యన్ల శ్రద్ధ ఎక్కువయిందని తెలిపారు. అయితే తమ ప్రభుత్వం, తమ ప్రజలు అక్కడ కమ్యూనిస్టు ప్రమాదాన్ని జరుగుతున్న ప్రయత్నాలను జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూనే ఉన్నారని చెప్పారు. రష్యా ఆర్థిక రాయబార విధానాలద్వారా కలిగే ప్రతికూలభావాల ప్రచారం, స్థానిక ప్రజలను రెచ్చగొట్టడం సాగించాలని యత్నిస్తున్నదన్నారు.

రేపు కామన్వెల్తు ప్రధానుల సమావేశం ఆగ్నేయాసియా, తూర్పు ఆసియా సమస్యలను చర్చిస్తుంది.

ఇవాళ రాత్రి ఈ సమావేశానికి వచ్చినవారిలో కొందరు లండన్ రేవు సంస్థ అధ్యక్షుడు లార్డ్ పేవర్లీ ఆతిథ్యం స్వీకరించి థేమ్స్‌నదిలో బోట్లలో కొంతసేపు విహరించారు.

న్యూఢిల్లీ, జూన్ 27: 1957 డిశెంబరుతో అంతం ఆయ్యే అర్ధ సంవత్సరంలో విదేశాలకు ఎగుమతికిగాను 5 వేల టన్నుల కొబ్బరి పిండిని విడుదల చెయ్యడానికి కేంద్ర ప్రభుత్వం నిశ్చయించినది.

## పరీక్షలవల్ల ఆసియాకే ప్రమాదం హెచ్చు

### పరిమిత ధార్మికశక్తివల్ల హానిలేదని భారత శాస్త్రజ్ఞుల భావం

న్యూఢిల్లీ, జూన్ 27: కాల్షియంకు కూరగాయలపై ఆధారపడే ఆసియా దేశాలకు, కాల్షియంకు పాలపై ఆధారపడే ఇతరదేశాలకన్నా అణ్వస్త్ర పరీక్షలవల్ల పదిరెట్లు ప్రమాదం ఉన్నదని భారత రక్షణశాఖ శాస్త్ర సలహాదారు డాక్టర్ కొఠారి అన్నారు. పరిమితమైన ధార్మికశక్తి ప్రసారం వల్ల మానవునకు ఎలాంటి హానీ ఉండదనీ, లేకపోతే ఎక్స్‌రే కిరణాల ప్రసారం మొదలైన వాటికి మానవుడు తట్టుకోలేక పోయేవాడనీ జాతీయ భౌతికశాస్త్ర పరిశోధనాలయ డైరక్టరు డాక్టర్ కె. యస్. కృష్ణన్ తెలిపారు.

అణ్వస్త్ర పరీక్షల ఫలితాలను గురించిన నలుగురు ప్రముఖ శాస్త్రజ్ఞుల చర్చను ఆలిండియా రేడియో ప్రసారం చేసింది. ఈ చర్చలో డా॥ కె. యస్. కృష్ణన్, డా॥ డి. యస్. కొఠారి, డా॥ పి. మహేశ్వరి, డా॥ ఖానోల్కర్ పాల్గొన్నారు. ఈ పరీక్షలను గురించిన వివిధ రకాల ఫలితాలను వీరు వివరించారు. కూరగాయలనుండి మానవశరీరం వరకూ అణురజంవల్ల కలిగే మార్పులను గురించి ప్రశ్నలు వేశారు. ముఖ్యంగా ఈసమస్యను ఆసియా దేశాలదృష్ట్యా పరిశీలించారు.

ఇదివరలో అమెరికా, రష్యాలు, ఈ మధ్య బ్రిటన్ చేస్తున్న పరీక్షలవల్ల గత 12 ఏండ్లలోను రేడియో ధార్మిక శక్తి ప్రసారంవల్ల వాతావరణంలో కలిగిన మార్పును గురించిన ప్రశ్నకు డాక్టర్ కృష్ణన్ ఇలా జవాబు చెప్పారు: "ఇప్పుడు ప్రకృతిలోనే కొంతవరకూ ధార్మిక శక్తి ఉంది. దీనిని మనం త్రోసివేసే వీలులేదు. ఉదాహరణకు మానవుని శరీరంలో కార్బన్-14 వంటి ధార్మికశక్తి పదార్థాలు ఉన్నాయి. సూర్యకిరణాల వల్ల వాతావరణంలోని నత్రజని నుండి ఈ పదార్థాలు ఉత్పత్తి ఔతున్నాయి. మొక్కలలో ఉండే కార్బన్ సర్వసాధారణమైనటువంటిది. దీనిలో ధార్మికశక్తి అతి తక్కువగా ఉంటుంది. కాని దీని నింకా పరిశీలించవలసి ఉంది."

ధార్మికశక్తి అంతా ప్రమాదమైనదేనా అనీ, లేక దీనికి పరిమితం ఉందాఅని అడిగిన ప్రశ్నకు ఆయన ఇలా చెప్పారు: వ్యక్తిగతంగామానవుడు ఎలాంటి హానిలేకుండా, కొంత ధార్మికశక్తి ప్రసారాన్ని తట్టుకోగలడు. ఐతే ఈ ప్రసారానికి పరిమితి ఉంది. ఇలా తట్టుకోలేకపోతే, ఎక్స్‌రే కిరణ ప్రయోగం వంటివాటిని మానవుడు సహించలేడు.

ముఖ్యంగా ఆసియాదేశాల ప్రజలపై అణురజ ప్రభావాన్ని గురించి మాట్లాడుతూ డాక్టర్ కొఠారి ఇలా అన్నారు: పెద్దపరీక్షలవల్లనే గాని, కిలోటన్ను ప్రయోగాలవల్ల ప్రమాదం అంతగా ఉండదు. ఈఅణురజప్రసారం స్థానికం అనీ, విశ్వవ్యాపితమని రెండు విధాలు. విశ్వవ్యాపితమైన ప్రసారం వల్లనే ప్రమాదం అధికం. ప్రస్తుతంలో మానవాళికి స్ట్రాంటియం 90 అత్యంత ప్రమాదకరమైనది. ఇది భూమినుండి ఆహారధాన్యాల ద్వారా మనశరీరంలో ప్రవేశిస్తుంది. దీనివల్ల భూమినుండి వచ్చే కాల్షియం పూర్తిగా చెడిపోతుంది. ఇదిశరీరంలో ఎంతఎక్కువగా ప్రవేశిస్తే, అంత ప్రమాదకరం. ఐతే, వివిధ ప్రాంతాలలోను ఈ అణురజ ప్రసారం ఒకేమాదిరిగా ఉన్నా, దీనివల్ల కలిగేహానిలో మాత్రం తరతమ భేదాలున్నాయి. మన దేశంలోని ప్రజలలో అత్యధికులకు కూరగాయల ద్వారా కాల్షియం లభిస్తోంది. పోతే పాలలో కూడా కాల్షియం ఉంటుంది. కాని మనదేశంలో ఉత్పత్తి అయ్యే పాలు బహు తక్కువ. అమెరికా, యూరప్ దేశాలలో నూటికి 80 వంతుల కాల్షియం పాలద్వారా లభిస్తోంది. అందులోనూ ఆవుపాలు శ్రేష్ఠం. కూరగాయల ద్వారా కాల్షియం పొందే మనకు ఇతర దేశాలవారికన్నా అణ్వస్త్ర పరీక్షలవల్ల పదిరెట్లు ప్రమాదం ఉంది.

### ఎముకలలో పుట్టకురుపు పుట్టేప్రమాదం

ప్రజలకు ఎలాంటి ప్రమాదం కలగకుండా, ఏదేశమూ అణ్వస్త్ర పరీక్షలను అధికకాలం కొనసాగించే అవకాశంలేదు. ఇలా జరిగే పరీక్షలవల్ల రక్తంవిరిగి పదిలక్షలమంది చనిపోతారనీ, రెండులక్షలమంది శిశువులు మానసిక దౌర్బల్యంతో జన్మిస్తారనీ డాక్టర్ పాలింగ్ అంచనావేశారు. ఈ అణురజంవల్ల ఒక ప్రత్యేకమైన ప్రమాదం ఉంది. స్ట్రాంటియం 90 ఎముకలలో గూడుకట్టుకొని ఉండడంవల్ల, కొన్ని సంవత్సరాల తరువాత ఎముకలలో పుట్టకురుపు పుట్టే అవకాశంఉంది. ఆహారం, పాలు మొదలైనవాటివల్ల లోనికివెళ్లే స్ట్రాంటియం 90 వల్ల శరీరానికి ప్రమాదం ఏర్పడుతుంది. ఇందువల్ల పిల్లలరక్తం విరిగిపోతుంది అన్నారు.

### రష్యా, ఈజిప్టుల మధ్య నౌకా యానం

లండన్, జూన్ 27: రష్యా, ఈజిప్టు దేశాలమధ్య నౌకాయానం యివాళ ప్రారంభమైంది. సోవియట్ నౌకా శాఖయమైన ఒడెస్సానుంచి కిమ్ అనే రష్యానౌకఅలెగ్జాండ్రియా రేవుచేరుకున్నదనిమాస్కో రేడియో ప్రకటించింది.

## హంగరీ సమస్యపై సమితి సమావేశం

### శీఘ్రంగా జరపాలని అమెరికా ప్రతినిధి లేఖ

న్యూయార్కు, జూన్ 27: హంగరీ సమస్యను పరిశీలించేందుకు సాధ్యమైనంత శీఘ్రంగా సమితి సమావేశం ఏర్పాటు చేయాలని సమితి సంఘ ప్రెసిడెంట్‌కు సమితిలోని అమెరికా ప్రతినిధి శ్రీ లాడ్జి ఉత్తరం వ్రాశారు, హంగరీ పరిస్థితులపై సమితి ప్రత్యేక సంఘ నివేదిక దృష్ట్యా ఈ సమావేశం జరపాలని ఆయన కోరారు. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు హంగరీ ప్రజలు చేసేకృషిని రష్యా బలవంతంగా అణచివేసిందనీ, రెండవ ప్రపంచ యుద్ధం తరువాత చేసికొన్న శాంతి సంధిని హంగరీలోని ప్రస్తుత కాదార్ ప్రభుత్వం భంగపరచిందనీ ఈ నివేదిక వల్ల స్పష్టమైందని ఈ లేఖలో పేర్కొన్నారు.

హంగరీ సమస్యను చర్చించేందుకు సమితి సమావేశాన్ని శీఘ్రంగా జరిపింపమని ప్రభుత్వాన్ని కోరుతూ అమెరికా ప్రజాప్రతినిధులసభ నిన్న తీర్మానించింది. ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టిన డెమొక్రాట్ సభ్యుడు పాల్ డగ్లస్ మాట్లాడుతూ సోవియట్ యూనియన్‌పై ఆంక్షలను విధించాలనే విషయాన్ని సమితి పరిశీలించాలన్నారు.

## పాక్ ఆక్రమిత కాశ్మీర్ విముక్తికి ఉద్యమం

### లక్షమంది భారతముస్లింలతో సత్యాగ్రహంచెయ్యాలనిసంకల్పం

పాట్నా, జూన్ 27: పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్ ప్రాంతం విముక్తికి శాంతియుతము అహింసాత్మకమైన సత్యాగ్రహోద్యమం ప్రారంభించాలనే సంకల్పంతో, లక్షమంది భారత ముస్లింసత్యాగ్రహులను చేర్చగలరని, భారత ముస్లిం యువక కాశ్మీర్ ఉద్యమసంస్థ అధ్యక్షుడు శ్రీ అబ్దుల్ ఖయ్యూం అన్సారీ ప్రకటించారు.

భారతదేశం అంతటా అన్ని ప్రాంతాల ముస్లింలనూ యీ ఉద్యమంలోకి తీసుకుంటారట.

భారతదేశంలో ముస్లింలు ఏపార్టీకి చెందినవారైనా, అందరూ కాశ్మీర్ సమస్య విషయంలో భారత ప్రభుత్వాన్నే బలపరుస్తున్నారని ప్రపంచానికి సందేహం మిగలకుండా ప్రకటింప చెయ్యగలరని శ్రీ అన్సారీ అన్నారు.

పాకిస్తాన్ ఇంక ఇస్లాం పేరు చెప్పుకునిమాట్లాడేఅర్హత పోగొట్టుకుంది. భారతముస్లింలపట్లపాకిస్తాన్అనురాగంచూపక పోనక్కరలేదు అన్నారు.

జనవాక్య నిర్ధారణ ఉద్యమసంస్థ అని పేరుపెట్టుకుని కాశ్మీరులో ఊరేగిన పాకిస్తాన్ మిత్రులు ఎన్నికల్లో పేరుకేలేకుండా ఓడిపోయారు.

శ్రీ అన్సారీ పూర్వ బీహార్ మంత్రి. వీరు దేశమంతటా తమ ఉద్యమ సందర్భంలో సభలు ఊరేగింపులు మొదలైనవి జరుపుతారని చెప్పారు.

### చేతకాకపోతే భద్రతా మండలి ఊరుకోవాలి

న్యూయార్కు, జూన్ 27:— భద్రతామండలి చేతనైతే కాశ్మీర్ నుంచి పాకిస్తానీలనుపంపించివెయ్యాలి, లేదా జనవాక్యం పేరెత్తకుండా ఊరుకోవాలి, అంటూ అమెరికన్ భారత సమితి అధ్యక్షులు శ్రీ జె. జె. సింగ్ ఒక విజ్ఞప్తి పత్రాన్ని అమెరికన్ కాంగ్రెస్‌లోని ముఖ్యులకు, సమితిలో ముఖ్య ప్రతినిధులకు, అమెరికాలో ప్రసిద్ధి చెందిన రచయితలు, కమ్యూనిస్టులకు అందచేశారు.

1948 ఆగస్టు 13 వ తేదీ భద్రతా మండలి తీర్మానంలో అమలు జరుపవలసిన అంశాలున్నాయి, అని శ్రీ సింగ్ ఈ పత్రంలో వివరించారు. ఈ తీర్మానం చెల్లదని మళ్ళీ మండలి నిర్ణయించే వరకూ అవి అమలు జరగవలసిందే. ఈ తీర్మానం ప్రకారం పాకిస్తానీబలాలను కాశ్మీర్ నుంచి తరలింప చేసిన తరవాత, అప్పుడు భారతదేశం జనవాక్యం జరపడానికి నిరాకరిస్తే నిందించి నా న్యాయం.

కాని తీర్మానంలో మొదటిభాగం అమలుజరగకుండానే ఉప్పెంగతువేసి, మూడో భాగం అమలు జరపాలనీ, భారతదేశం జనవాక్యం సేకరించాలనీ వాదించడం, చివరికి కాశ్మీర్ నుంచి పాకిస్తాన్ సైన్యాలు తరలిపోవాలని ఒక్కమాటైనా అనకపోవడం అక్రమం అని శ్రీ సింగ్ అన్నారు.

### నెహ్రూ ప్రతిష్ఠ: సురావర్ది తాపత్రయం

లండన్, జూన్ 27: కాశ్మీరు సమస్యలో ఒక ప్రధానమైన సిద్ధాంతం ఇమిడిఉంది; వివాదాలు కలహాలు అంతర్జాతీయ సంస్థద్వారా పరిష్కారం చేసుకోవాలా, లేక, అటవిక మృగాల సంప్రదాయానికి దిగవలసిందే అనేది ఆ సిద్ధాంతం. నాగరికతకలదేశాలు, ముఖ్యంగా శాంతి, అంతర్జాతీయ నైతిక ప్రాతిపదిక అంటూ చెప్పుకొనే దేశాలే ఆ అంతర్జాతీయ నీతిని పాటించరాదా? అని పాకిస్తాన్ ప్రధాని శ్రీ సురావర్ది, ఇక్కడ పాకిస్తాన్ విద్యార్థుల సభలో ప్రసంగిస్తూ అన్నారు.

కాశ్మీరులో న్యాయంగా స్వేచ్ఛగా జనవాక్యం సేకరించడం అవసరం అని సురావర్ది అన్నారు.

భారతదేశంతో అత్యంత మైత్రితో ఉండాలనేవారి అభిమతం.

శ్రీ నెహ్రూను, ప్రపంచ వ్యాప్తమైనవారి ప్రతిష్ఠకోసం మార్గం మార్చుకోవాలని ప్రార్థిస్తున్నారన్నారు. లేకపోతే వారిమాటకేకాదు, భారతదేశానికి అంతర్జాతీయ వర్గాలలో విలువ లేకుండా పోతుంది, అన్నారు.

### పాకిస్తాన్‌లో ఎన్నికలు

1958 మార్చిలో పాకిస్తాన్‌లో మొట్టమొదటి ఎన్నికలు జరిగితే చూడాలని ఆత్రుత పడుతున్నట్లు పాకిస్తాన్ విద్యార్థులు తమ సన్మానపత్రంలో అన్నారు. దీనికి జవాబిస్తూ శ్రీ సురావర్ది, "ఆ పనొకటి చెయ్యాలని సంకల్పించుకున్నానంటే, అది చేసితీరతాను. వచ్చే మార్చిలో ఎన్నికలు జరుగుతాయన్నాను. ఎవరికి ఇష్టం అయినా కాకపోయినా జరిగితీరతాయి" అన్నారు.

### జమ్మూ నగరంలో బాంబు ప్రేలుడు

జమ్ము, జూన్ 27: భారత విమాన యాన సంస్థకు చెందిన ఒక కారులో ఇవాళ ఒక బాంబు ప్రేలింది. దీనివల్ల ఒకరు మరణించారు. కారంతా దగ్ధమై పోయింది.

ఈ నగరంలో ఇప్పటికి ఈకొద్ది రోజులలో బాంబు ప్రేలడం ఇది మూడోసారి.

ఈ కారు ఢిల్లీ నుంచి శ్రీనగరం వెడుతూ, దారిలో ఇక్కడ ఆగినప్పుడు బాంబు ప్రేలింది. ఈ విషయమై దర్యాప్తు జరుగుతున్నది.

### కాశ్మీర్ ఎగువసభకు జాతీయ పక్షం అభ్యర్థులు

శ్రీనగర్, జూన్ 27: కాశ్మీర్ శాసనమండలి (ఎగువసభ) ఎన్నికలకు జాతీయపక్షం తన అభ్యర్థుల జాబితా ప్రకటించింది.

36 మంది సభ్యులుండే ఎగువసభలో 22 మందిని శాసనసభ ఎన్నుకుంటుంది. నలుగురిని పంచాయతీలు, ఇద్దరిద్దరిని స్థానికసంస్థలు, ఉపాధ్యాయులు ఎన్నుకుంటారు. మిగతా ఆరుగురినీ సదర్-ఇ-రియాసత్ నియమిస్తారు.

జాతీయపక్షం ఎంచిన అభ్యర్థులలో పూర్వం మహారాజా ప్రభుత్వంలో మంత్రిగా పనిచేసిన వజీర్ గంగారాం, పూర్వ పార్లమెంటు సభ్యుడు శ్రీ శివ నారాయణ్ ఫోతేదార్, ముగ్గురు పూర్వ శాసనసభ్యులు ఉన్నారు.

